# హనుమాన్ చాలీసా ధ్యానం

దోహా-

శ్రీ గురు చరణ సరోజ రజ
నిజమన ముకుర సుధారి
వరణా రఘువర విమల యశ
జో దాయక ఫలచారి ||




అర్థం – శ్రీ గురుదేవుల పాదపద్మముల ధూళితో అద్దము వంటి నా మనస్సును శుభ్రపరుచుకుని, చతుర్విధ ఫలములను ఇచ్చు పవిత్రమైన శ్రీరఘువర (రామచంద్ర) కీర్తిని నేను తలచెదను.

# హనుమాన్ చాలీసా ధ్యానం

బుద్ధిహీన తను జానికే సుమిరౌ పవనకుమార
బల బుద్ధి విద్యా దేహు మోహి హరహు కలేశ వికార ॥

తంగిరాల చంద్రశేఖర అవధాని



అర్థం – బుద్ధిహీన శరీరమును తెలుసుకొని, ఓ పవన కుమారా (ఆంజనేయా) నిన్ను నేను స్మరించుచున్నాను నాకు బలము, బుద్ధి, విద్యను ప్రసాదించి నా కష్టాలను వికారాలను తొలగించుము.

# హనుమాన్ చాలీసా 1వ శ్లోకము




చౌపాఈ-

జయ హనుమాన జ్ఞానగుణసాగర |
జయ కపీశ తిహు లోక ఉజాగర || ౧ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం – ఓ హనుమంతా, జ్ఞానము మరియు మంచి గుణముల సముద్రమువంటి నీకు, వానరజాతికి ప్రభువైన నీకు, మూడులోకాలను ప్రకాశింపజేసే నీకు జయము జయము...

# హనుమాన్ చాలీసా 2 వ శ్లోకము




రామదూత అతులిత బలధామా |
అంజనిపుత్ర పవనసుత నామా ॥ ౨॥

తంగిరాల చంద్రశేఖర శర్మ

అర్థం - నీవు శ్రీరామునకు దూతవు,
అమితమైన బలము కలవాడవు, అంజనీదేవిపుత్రుడిగా,
పవన సుత (పవన - వాయువు,- సుత కుమారుడు)అను
నామము కలవాడవు.

# హనుమాన్ చాలీసా 3 వ శ్లోకము




మహావీర విక్రమ బజరంగీ |
కుమతి నివార సుమతి కే సంగీ || 3 ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం – నీవు మహావీరుడవు, పరాక్రమముతో కూడిన వజ్రము వంటి దేహము కలవాడవు, చెడు మతి గల వారిని నివారించి మంచి మతి కలవారితో కలిసి ఉండువాడవు,

# హనుమాన్ చాలీసా 4 వ శ్లోకము




కంచన వరణ విరాజ సువేశా |
కానన కుండల కుంచిత కేశా || ౪ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం – బంగారురంగు గల దేహముతో,మంచి వస్త్రములు కట్టుకుని, మంచి చెవి కుండలాలు (దుద్దులు) పెట్టుకుని, ఉంగరాల జుట్టు కలవాడవు.

Note

# హనుమాన్ చాలీసా 5 వ శ్లోకము



హాథ వజ్ర ఔరు ధ్వజా విరాజై |
కాంధే మూంజ జనేవూ సాజై || ౫ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

సనాతన ధర్మం

అర్థం – ఒక చేతిలో వజ్రాయుధము (గద), మరొక చేతిలో విజయానికి ప్రతీక అయిన ధ్వజము (జెండా) పట్టుకుని, భుజమందు ముంజ గడ్డితో చేయబడిన యజ్ఞోపవీతమును ధరించినవాడవు...

# హనుమాన్ చాలీసా 6 వ శ్లోకము



శంకర సువన కేసరీనందన |
తేజ ప్రతాప మహా జగవందన || ౬ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

సనాతన ధర్మం

అర్థం – శంకరుని అవతారముగా, కేసరీ పుత్రుడవైన నీ తేజస్సును ప్రతాపమును చూసి జగములు వందనము చేసినవి.

# హనుమాన్ చాలీసా 7 వ శ్లోకము



విద్యావాన గుణీ అతిచాతుర |
రామ కాజ కరివే కో ఆతుర || ౭ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

సనాతన ధర్మం

అర్థం – విద్యావంతుడవు, మంచి గుణములు కలవాడవు, బుద్ధిచాతుర్యము కలవాడవు అయిన నీవు శ్రీ రామచంద్ర కార్యము చేయుటకు ఉత్సాహముతో ఉన్నవాడవు.

# హనుమాన్ చాలీసా 8 వ శ్లోకము




ప్రభు చరిత్ర సునివే కో రసియా |
రామ లఖన సీతా మన బసియా || ౮ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం – శ్రీరామచంద్ర ప్రభువు యొుక్క చరిత్రను వినుటలో తన్మయత్వము పొంది, శ్రీ సీతా, రామ, లక్ష్మణులను నీ మనస్సులో ఉంచుకున్నవాడవు.

# హనుమాన్ చాలీసా 9 వ శ్లోకము




సూక్ష్మరూప ధరి సియహి దిఖావా |
వికటరూప ధరి లంక జరావా || ౯ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం - సూక్ష్మరూపము ధరించి సీతమ్మకు కనిపించినవాడవు, భయానకరూపము ధరించి లంకను కాల్చినవాడవు.

## హనుమాన్ చాలీసా 10 శ్లోకము

భీమరూప ధరి అసుర సంహారే |
రామచంద్ర కే కాజ సంవారే || ౧౦ ||




తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం – మహాబలరూపమును ధరించి రాక్షసులను సంహరించినవాడవు, శ్రీరామచంద్రుని పనులను నెరవేర్చినవాడవు.

# హనుమాన్ చాలీసా 11 వ శ్లోకము




లాయ సంజీవన లఖన జియాయే |
శ్రీరఘువీర హరషి వుర లాయే || ౧౧ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం – సంజీవిని తీసుకువచ్చి లక్ష్మణుని బ్రతికించిన నీ వల్ల శ్రీరఘువీరుడు (రాముడు) చాలా ఆనందించాడు.

# హనుమాన్ చాలీసా 12 వ శ్లోకము




రఘుపతి కీన్హీ బహుత బడాయీ |
తుమ మమ ప్రియ భరత సమ భాయీ || ౧౨||
[** పాఠభేదః – కహా భరత సమ తుమ ప్రియ భాయి **]

అర్థం – అంత ఆనందంలో ఉన్న శ్రీరాముడు నిన్ను మెచ్చుకుని, తన తమ్ముడైన భరతుని వలె నీవు తనకు ఇష్టమైనవాడవు అని పలికెను.

# హనుమాన్ చాలీసా 13 వ శ్లోకము




తంగిరాల చంద్రశేఖర అవధాని

సహస్ర వదన తుమ్హరో యశ గావై |
అస కహి శ్రీపతి కంఠ లగావై || ౧౩ ||

అర్థం – నీ కీర్తిని భవిష్యత్తులో అందరూ వేనోళ్ళ గానం చేసి తరించెదరు గాక!" అని పలికి శ్రీరాముడు నిన్ను కౌగలించుకొనెను..

# హనుమాన్ చాలీసా 14&15 శ్లోకములు

సనకాదిక బహ్మాది మునిశా |
నారద శారద సహిత అహీశా || ౧౪ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

యమ కుబేర దిగపాల జహా్ తే |
కవి కోవిద కహి సకే కహా్ తే || ౧౫ ||




అర్థం – సనకాది ఋషులు, బ్రహ్మాది దేవతలు, నారదుడు, విద్యావిశారదులు, ఆదిశేషుడు, యమ కుబేరాది దిక్పాలురు, కవులు, కోవిదులు వంటి ఎవరైనా నీ కీర్తిని ఏమని చెప్పగలరు?..

# హనుమాన్ చాలీసా 16వ శ్లోకము



తుమ ఉపకార సుగ్రీవహి కీన్హా |
రామ మిలాయ రాజ పద దీన్హా || ౧౬ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని సనాతన ధర్మం

అర్థం – నీవు సుగ్రీవునికి చేసిన గొప్పఉపకారము ఏమిటంటే రాముని తో పరిచయం చేయించి రాజపదవిని కలిగించావు..

# హనుమాన్ చాలీసా 17 వ శ్లోకము



తంగిరాల చంద్రశేఖర అవధాని

తుమ్హారో మంత్ర విభీషణ మానా |
లంకేశ్వర భయె సబ జగ జానా || ౧౭ ||

సనాతన ధర్మం

అర్థం – నీ ఆలోచనను విభీషణుడు అంగీకరించి లంకకు రాజు అయిన విషయము జగములో అందరికి తెలుసు..

## హనుమాన్ చాలీసా 18 వ శ్లోకము




యుగ సహస్ర యోజన పర భానూ |
లీల్యో తాహి మధుర ఫల జానూ || ౧౮ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం - యుగ సహస్ర యోజనముల దూరంలో ఉన్న భానుడిని (సూర్యుడిని) మధురఫలమని అనుకుని అవలీలగా నోటిలో వేసుకున్నవాడవు.

# హనుమాన్ చాలీసా 19 వ శ్లోకము




ప్రభు ముద్రికా మేలి ముఖ మాహీ |
జలధి లాంఘి గయే అచరజ నాహీ || ౧౯ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం - అలాంటిది శ్రీరామ ప్రభు ముద్రిక (ఉంగరమును) నోటకరచి సముద్రాన్ని ఒక్క ఉదుటన దూకావు అంటే ఆశ్చర్యం ఏముంది?..

# హనుమాన్ చాలీసా 20 వ శ్లోకము




దుర్గమ కాజ జగత కే జేతే |
సుగమ అనుగ్రహ తుమ్హారే తేతే || ౨౦ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం – జగములో దుర్గము వలె కష్టమైన పనులు నీ అనుగ్రహం వలన సుగమం కాగలవు.

# హనుమాన్ చాలీసా 21 వ శ్లోకము

రామ దువా(ఆ)రే తుమ రఖవారే |
హోత న ఆజ్ఞా బిను పైఠారే (పైసారే )|| ౨౧ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని




అర్థం - శ్రీరాముని ద్వారపాలకుడవు నీవు.
నీ ఆజ్ఞలేనిదే లోపలికి వెళ్ళుటకు ఎవ్వారికీ వీలులేదు.
(నీ అనుగ్రహము లేకుండా రాముని కృప ఎవరికీ దొరకదు)

# హనుమాన్ చాలీసా 22 వ శ్లోకము

సబ సుఖ లహై తుమ్హారీ శరణా |
తుమ రక్షక కాహూ కో డరనా || ౨౨ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం – నీ ఆశ్రయములో అందరు సుఖముగా ఉంటారు. నీవే రక్షకుడవు అయితే ఇంకా భయం ఎందుకు?

## హనుమాన్ చాలీసా 23 వ శ్లోకము

ఆపన తేజ సంహారో ఆపై |
తీనోఁ లోక హాంక తేఁ కాంపై || ౨3 ||

తంగిరాల చంద్రశేఖర అవధాని



సనాతన ధర్మం

అర్థం – నీ తేజస్సును నీవే నియంత్రించగలవు.
నీ కేకతో మూడులోకాలు కంపించగలవు.

## హనుమాన్ చాలీసా 24 వ శ్లోకము




భూత పిశాచ నికట నహిఀ ఆవై |
మహావీర జబ నామ సునావై || ౨౪ ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం – ఓ మహావీరా! నీ నామస్మరణ వింటే భూతప్రేత పిశాచములు దగ్గరకు రావు.

## హనుమాన్ చాలీసా 25వ శ్లోకము

నాసై రోగ హరై సబ పీరా -
జపత నిరంతర హనుమత వీరా || 25 ||




అర్థం:- నిరంతరము వీర హనుమంతుని నామము జపించినచో  సమస్త రోగములు నశించును. అన్ని పీడలు హరించుకుపోవును....

# హనుమాన్ చాలీసా 26 వ శ్లోకము




సంకటసే హనుమాన ఛుడావై |
మన క్రమ వచన ధ్యాన జో లావై || 26 ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం :- ఎవరైతే మనోవాక్కాయ కర్మలచే తనను. ధ్యానించినచో వారిని ఆంజనేయుడు సమస్త సంకటముల నుండి విముక్తి చేయును...

# హనుమాన్ చాలీసా 27 వ శ్లోకము




సబ పర రామ తపస్వీ రాజా |
తిన కే కాజ సకల తుమ సాజా || 27 ||

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం:- శ్రీరామచంద్రుడు తాపసులకు అందరకు గొప్పవాడు . ప్రభువు వంటివాడు. ఆయన సకల కార్యములను ఓ ఆంజనేయా! నీవు చక్కగా సవరించుచుందువు

# హనుమాన్ చాలీసా 28 వ శ్లోకము



ఔర మనోరథ జో కోయీ లావై -
సోయీ అమిత జీవన ఫల పావై | 28

తంగిరాల చంద్రశేఖర అవధాని

సనాతన ధర్మం

అర్థం :- ఎవరు ఏయే కోర్కెలతో శ్రీ హనుమంతుని సేవింతురో వారికి ఆ కోర్కెలు తీరి అనంతమైన జీవన ఫల ప్రాప్తి కలుగును...

# హనుమాన్ చాలీసా 29వ శ్లోకం

చారో యుగ ప్రతాప తుమ్హారా|
హై పరసిద్ధ జగత ఉజియారా || 29 ||




అర్థం:- ఓ హనుమా! నీ యొక్క ప్రతాపము నాలుగు యుగములలోనూ ప్రసిద్ధమైనవి. జగత్తంతయు నీ కీర్తి కాంతులతో ప్రకాశమానమై ఉన్నది

## హనుమాన్ చాలీసా 30 వ శ్లోకము

సాధు సంతకే తుమ రఖవారే |
అసుర నికందన రామ దులారే || 30 ||



తంగిరాల చంద్రశేఖర అవధాని

సనాతన ధర్మం

అర్ధం:- సాధన చేసేవారికి చక్కగా తపస్సు చేసేవారికి నీవు రక్షకుడవు. దుర్మార్గులను నాశనము చేయువాడవు మరియు శ్రీరామునికి అత్యంత ప్రియమైనవాడవు.

# హనుమాన్ చాలీసా 31 వ శ్లోకము



అష్ట సిద్ధి నవ నిధికే దాతా -
అసవర దీన జానకీ మాతా | 31

తంగిరాల చంద్రశేఖర అవధాని

సనాతన ధర్మం

అర్థం:- అష్టసిద్ధులను నవవిధులను
ప్రసాదింపగలుగునటులజానకీ మాత నీకు వరమొసగెను.

# హనుమాన్ చాలీసా 32 వ శ్లోకము

రామ రసాయన తుమ్హరే పాసా -
సదా రహో రఘుపతి కే దాసా | 32

తంగిరాల చంద్రశేఖర అవధాని




అర్థం:- రామరసాయనము నీవద్ద గలదు.
నీవు ఎల్లప్పుడూ శ్రీరామచంద్రుని సేవకుడవై ఉందువు

## హనుమాన్ చాలీసా 33 వ శ్లోకము

తుమ్హరే భజన రామ కో పావై -
జనమ జనమ కే దుఃఖ బిసరావై | 33

తంగిరాల చంద్రశేఖర అవధాని




అర్థం:- నీయొక్క భజన వలన రామానుగ్రహము పొంది జన్మ జన్మంతారముల దుఃఖముల నుండి విముక్తి పొందెదరు.

# హనుమాన్ చాలీసా 34 వ శ్లోకము



అంత కాల రఘువర పుర జాయీ -
జహా జన్మ హరిభక్త కహాయీ | 34

తంగిరాల చంద్రశేఖర అవధాని

సనాతన ధర్మం

అర్ధం:- (నిన్ను భజించినవారు) మరణించిన పిదప వైకుంఠమునకు పోవుదురు. మరల జన్మించినచో వారు హరిభక్తులుగా  ప్రసిద్ధి చెందుదురు..

# హనుమాన్ చాలీసా 35 శ్లోకము

ఔర దేవతా చిత్త న ధరయీ -
హనుమత సేయి సర్వ సుఖ కరయీ | 35

తంగిరాల చంద్రశేఖర అవధాని




అర్థం :- ఇతర దేవతలకు తన హృదయము నందు స్థానమీయక శ్రీ హనుమంతునే ధ్యానించు వారికి (ఆంజనేయుడు) సమస్త సుఖములను ఒసంగును.

## హనుమాన్ చాలీసా 36 వ శ్లోకము



సంకట క(హ)టై మిటై సబ పీరా -
జో సుమిర్రై హనుమత బలవీరా | 36

తంగిరాల చంద్రశేఖర అవధాని

సనాతన ధర్మం

అర్థం:- మహాబలుడగు ఆంజనేయుని ఎవరైతే స్మరింతురో వారి సంకటములన్నియు తొలగి పీడలన్నియు నశించును.

## హనుమాన్ చాలీసా 37 వ శ్లోకము

జై జై జై హనుమాన గోసాయీ -
కృపా (కరో)కరహు గురు దేవకీ నాయీ | 37

తంగిరాల చంద్రశేఖర అవధాని




అర్థం :- జితేంద్రియుడైన ఓ ఆంజనేయ!
నీకు జయము జయము జయము.
గురుదేవుని వలె (నాయందు) దయ జూపుము

# హనుమాన్ చాలీసా 38 వ శ్లోకము




జో శత బార పాఠ కర కోయీ -
ఛూటహి బంది మహా సుఖ హోయీ | 38

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం :- ఎవరైతే (ఈ చాలీసాను) నూరుమార్లు పఠనము చేయుదురో వారికి అన్ని బంధనములు వీడి పరమానంద ప్రాప్తి కలుగును...

## హనుమాన్ చాలీసా 39 వా శ్లోకము




జో యహ పఢై హనుమాన చలీసా -
హోయ సిద్ధి సాఖీ గౌరీసా | 39

తంగిరాల చంద్రశేఖర అవధాని

అర్థం :- ఎవరైతే ఈ హనుమాన్ చాలీసాను పఠింతురో వారికి పార్వతీపరమేశ్వరుల సాక్షిగా సిద్ధికలుగును.

హనుమాన్ చాలీసా 40 వ శ్లోకము




తులసీదాస సదా హరి చేరా -
కీజై నాథ హృదయ మహ డేరా | 40

అర్థం :- ఓ నాథా (ఆంజనేయా!) ఈ తులసీదాసు ఎల్లప్పుడూ హరి సేవకుడే కావున నా హృదయమందు నివసింపుము...

దోహా:

పవనతనయ సంకట హరణ మంగళ మూరతి రూప
రామ లఖన సీతా సహిత హృదయ బసహు సుర భూప |

అర్థం :- సమస్త సంకటములను హరింప చేసెడివాడవు. మంగళ స్వరూపుడవు, సమస్త దేవతలకు నాధుడవు అయినా ఓ ఆంజనేయా! సీతారామ లక్ష్మణ సహితుడవై నా హృదయమున వసింపుము...